# జాతకకథాగుచ్ఛము

## [ క్షాంతివాది జాతకము ]

శిరోమణి:

సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి

# ఉపోద్ఘాతము

జాతక కథలనఁగా నేఁటికి రమారమి రెండువేల నన్నూఱేండ్లకు ముందు మన హిందూదేశమున జనియించిన మత ప్రవక్తలలోఁ బ్రథమాచార్యుఁడగు గౌతమబుద్ధుని పూర్వావతార కథలు. శూన్యవాదము, నిరాత్మవాదము మొదలగు బౌద్ధ సిద్ధాంతములను ఖండించిన శ్రీ శంకరాచార్యుల వంటివారు సైతము "భగవాన్ శౌద్ధోదనిః" యని బుద్ధుని గౌరవించుట, యా సిద్ధాంతమునే జగన్మిథ్యాత్వ రూపమునఁ బ్రతిపాదించుటఁ జేసి కాఁబోలు ప్రచ్ఛన్న బౌద్ధుఁడని శంకరాచార్యుఁడు పరమతస్థులచే దూషింపఁ బడుటయుఁ జూడ నా కాలమందలి జను లాతనిని భగవంతునికన్న మిన్నగా సంభావించి యుందు రన్న నతిశయోక్తి కాదు. దుష్టశిక్షణ శిష్టరక్షణార్థము శ్రీమన్నారాయణుఁడు దశావతారములు ధరించెనని విశ్వసించు హిందూ ధర్మావలంబకులవలెనే తన్మతావలంబు లగు తద్భక్తు లా మహాత్ముఁడును క్షాంతి, దాంతి భూతదయా, దాన, వైరాగ్యాదులగు ధర్మములను బోధించి యైహిక సుఖ పరతంత్రముగు మూఢ హృదయములను నిర్వాణ పరతంత్రములనుగాఁ జేసి లోకము నుద్ధరింపఁగలఁచి యైదున్నూట నలువదే డవతారము లెత్తెనని విశ్వసించుచున్నారు. ప్రత్యవతారము నందును శ్రీమన్నారాయణునివలెనే లోకోపకారార్థము మహాత్యాగముఁ గావించెననియు నమ్ముచున్నారు. హిందూమతస్థులు బుద్ధుఁడు నారాయణావతార మని విశ్వసించినను బౌద్ధులట్లు విశ్వసింపరు.

యథార్థము విచారింప హిందూబౌద్ధ మతసిద్ధాంతములకు వైజాత్యముకన్న సాజాత్య మధికము. ఈ విషయమును నిట గ్రంథవిస్తరభీతిచే సంగ్రహింతును. బుద్ధుఁడు చార్వాకునివలె నాస్తికుఁడుగాఁడు. హిందూగృహస్థులకువలె వేదోక్తములగు గార్హస్థ్య ధర్మములలో హింసాత్మకములగు శ్రౌతయజ్ఞ యాగములును చాతుర్వర్ణ్య భేదమును బుద్ధునకు సమ్మతములు

గావు. "మరియు నచింత్యమైన యాత్మానాత్మ విచారమను శుష్కవాదములోఁ బడక వైరాగ్యముచే మనస్సును నిష్కామముగాఁ జేసికొమ్ము; ఆత్మయున్నను లేకున్నను మనోనిగ్రహము ప్రథమకార్యము." అనియే బుద్ధుని సిద్ధాంతము. శంకరులవారు నుడివిన బ్రహ్మముగానీ, ఆత్మగానీ బొత్తుగా లేనే లేదని యాతని యుద్దేశముగాదు. ఏలనఁ గొన్ని సుత్తలందు బుద్ధుఁడే బ్రహ్మసహవ్యతాయస్థితి నుదాహరించెను. మరియు "నేను బ్రహ్మభూతుఁడనై యున్నాను" అని పెక్కుచోట్ల ముక్తకంఠముతోఁ బలికెను. ఆత్మనుగూర్చి చేయు పాతాళప్రశ్నలు మాని "అహింస, సత్యము, అస్తేయము, శౌచము, మనఃపూతత, సత్పాత్రదానము, ఆత్మౌపమ్యదృష్టి" మొదలగు నిర్వాణప్రాప్తిసాధనముల నవలంబింపుఁడని బోధించెను. రోగమును గుదుర్చుటకు ముందు దాని మూలకారణమును గుర్తించి వైద్యుఁడు దానినిఁ దొలఁగించునట్లు సాంసారిక దుఃఖరూపమగు రోగము నుపశమింపఁ జేయుటకుఁ దత్కారణ మారసి నిర్మూలింపవలయును. సంసార దుఃఖమునకుఁ గారణము తృష్ణ లేక వాసన. ఒక నామరూపాత్మకమగు దేహము నశించిన పిమ్మట మిగిలియున్న యీ వాసనాత్మక బీజమునుండి మరొక నామరూపాత్మకమైన దేహము వెలువడును. దానినుండి వేరొకటి యుదయించును. కావున నీ పునర్జన్మరూపమగు సంసారదుఃఖమునుండి విముక్తుఁడగుటకు మానవుఁడు యత్నింపవలెను. దానికి సాధనములు వైరాగ్యము, ఇంద్రియ నిగ్రహము, అహింస, భూతదయ మొదలగునవి. వీనిమూలమునఁ దృష్ణ లేక వాసన నున్మూలింప వలయును. ఈ క్రమమునే బౌద్ధులు దుఃఖము, సముదయము, నిరోధము, మార్గము అని పేర్కొని వీనికి నార్య సత్యములని పేరిడిరి ఇందలి నాల్గవ సత్యమైన మార్గము. అనఁగా వాసనాక్షయము లేక తృష్ణాక్షయము లేక నిర్వాణము (దీప మాఱిపోయిన విధమున వాసన లారుట)ను బొందుటకు మనుష్యుఁడు మనస్సును నిర్విషయముగాఁ జేసికొనుట. ఉపనిషత్కారులు చెప్పిన ఆత్మనిష్ఠ, బ్రహ్మసంస్థ, బ్రహ్మభూతత,

బ్రహ్మనిర్వాణము, అను నవస్థయు పైని బుద్ధుని నాల్గవసత్యమగు మార్గమును భిన్నములు గావనియే తోఁచును. రెండు ధర్మములయందును మనస్సు యొక్క నిర్విషయస్థితియే సాధ్యము.

బుద్ధుఁ డాత్మాస్తిత్వము నిర్ధారింపకున్నను జిత్తమును బ్రశాంతము, విరక్తము, నిష్కామము గను జేయుటకు సోపానము లగు వైరాగ్యాదులే నిర్వాణప్రాప్తి సాధనములని చెప్పుటవలన నుపనిషత్కారుల మోక్షసాధనములే పేర్కొనబడిన వగుచున్నవి. కావున బౌద్ధులయొక్కయు హిందువుల యొక్కయు వర్ణన లీషద్భేదముతో సరిపోవుచున్నవి. మరియుఁ బునర్జన్మ సిద్ధాంతములు, పాపపుణ్యఫలకల్పనములు, కర్మవిపాకము మొదలగునవన్నియు నీరెండుమతములందును దుల్యములే. కావున గృహస్థాచరణీయ యజ్ఞయాగాది కర్మలయందును, చాతుర్వర్ణ్య వ్యవస్థాదికములగు కొన్ని యల్ప విషయములందును దక్క నవశిష్టములగు మతధర్మములందు హిందూ బౌద్ధులకు భేదము లేదనవచ్చును. లెస్సగా విచారింప బౌద్ధధర్మ మను పుత్రుఁడు వైదిక ధర్మ మను తండ్రికడఁ బంచుకొని వేఱుపడ్డవాఁడే కాని భిన్నుఁడు గాఁడు. అనఁగా సనాతన హిందూధర్మములనుండి గ్రహింపఁబడినదే కాని క్రొత్తది కాదు. ఆ కాలమున వైదికమత మడుగంటి బౌద్ధమతమే విశేషముచే భరతఖండ మాత్రమే కాక టిబేటు, చైనా, జావా, సుమిత్రా, సింహళము మొదలగు దేశములకుఁగూడఁ బ్రాఁకిపోయెనన్న గృహస్థులకు యజ్ఞ యాగాది కర్మ కాండపీడయుఁ జాతుర్వర్ణ్య భేదపిశాచమును వదలిపోవుటచేతనే యయి యుండునని నా యూహ.

వైదిక ధర్మములను బురాణములువోలె బౌద్ధధర్మములను జాతక కథలు వివరించుచున్నవి. జనసామాన్యము కథలమూలమున విజ్ఞానమును సాధించునట్లు శుష్కవేదాంత గ్రంథముల వలన సాధింపదనుట నిర్వివాదాంశము. కావ్యము కాంతాసమ్మిత మనుటలో గల రహస్యమిదియే.

# ఉపోద్ఘాతము

అట్లగుటఁ బ్రపంచములోని యెల్లభాషలందును గావ్య వాఙ్మయమునకుఁ గల ప్రతిష్ఠ విశిష్టము.

ఈ జాతకకథలు మొట్టమొదటఁ బాళీభాషలో వ్రాయఁబడి యున్నవి. వీనిలోని ముప్పదిరెండు కథలను ఆర్యశూరుఁడను కవి సంస్కృతీకరించి 'జాతకమాల' యని పేరిడెను. దానినుండి యయిదు కథలను మాత్రము గొని రసానుకూలము లని నాకుఁదోఁచిన యలతి మార్పులను గావించుకొని యీ చిన్ని పొత్తమును విరచించితిని. గుణగ్రహణ పారీణు లగు కోవిదులు నా యీ సాహసమును మన్నింతురుగాక.

గోకులము, సికింద్రాబాద్.<br>22—5—1939.

గ్రంథకర్త.

# జాతకకథా గుచ్ఛము

## క్షాంతివాది జాతకము

ఒకతూరి బోధిసత్త్వం
డకలంకపరిష్కృతి బ్రాహ్మణాన్వయ మందున్
సకలగుణార్ణవుఁ డగు పు
త్త్రికుఁడై శుభలగ్నమందుఁ బ్రభవం బయ్యెన్. ౧

పున్నమచందమామ నగు
ముద్దుమొగంబును, దమ్మిరేకులన్
బన్నపడంగఁజేయు నయ
నమ్ములుఁ, జక్కనియెత్తు నెన్నొసల్
పెన్నురమున్, దృఢాంగమును,
బెంపగు మూఁపులు, దీర్ఘబాహువుల్
పొన్నపు మేనిచాయఁ దగి
శోభిలు నాతఁడు చక్కనయ్యె నాన్. ౨

వానికన్నముందో? వానితోడనె పుట్టె
భూతదయ పరిభూతముగ నెడంద
క్షాంతి దాంతి [illegible]ట్టి సద్గుణసముదాయ
ముగ్గుపాల తోడ నుప్పతిల్లె. ౩

కఱవకయ సకలవిద్యలుఁ
గరామలక మయ్యె; నందుఁ గల ధర్మంబుల్
చరియించుచుండుఁ దూ చాఁ
బరిత్యజింపక యతండు బాల్యమునుండిన్. ౪

కుంటిగ్రుడ్డులఁ జీరి కూడు గుడ్డ లొసంగి
వలసిన యుపచారముల నొనర్చు
నాకలిగొన్న నాగాంతకునకునైనఁ
గొంచక మెయికండఁగోసి యిచ్చుఁ
బ్రాణంబుల హరించు పాఁపపుర్వులనేనిఁ
గన్నబిడ్డలరీతిఁ గాచి వదలు
నఱకంగఁబడుచున్న తరుగుల్మములనేనిఁ
గని కంటఁ దడిపెట్టుకొనుచు నుండు
ఎత్తువడ్డ పసుల నెత్తి మూఁపున మోయుఁ
బులుఁగుకాలు విఱుగఁ బూయు మందు
నతఁడు ముల్లువిఱుగఁ బ్రాణిమాత్రమునకు
బిట్టుఁ బొగులుఁ దేలు కుట్టినట్లు. ౫

చదువును జక్కందనమును
గుదురును దనమనసుఁ జూఱగొనవచ్చె యశ
స్సుదతీరత్నము తెలియని
మదనావేశమున నా కుమారుని కడకున్. ౬

బలిసె రెట్ట; కండపట్టె శరీరంబు
గట్టిపాటె; మీసకట్టు వచ్చె;
జవ్వనంపుమిసిమి సర్వాంగములనిండఁ
గన్నులను విరక్తిచిన్నెలొదవె. ౭

చక్కని చుక్కలై, చదువుసంపదలన్ శుభలక్షణంబులన్
మిక్కిలివారలై, రమణినిన్ వలపించెడు చొక్కుమందులై,
చక్కెరవిల్తుకోలలయి చక్కెరబొమ్మలు నైనవారలన్
బెక్కురు విప్రులాతనికి బిడ్డల నీయఁగ వచ్చి రత్తఱిన్. ౮

తనయెత్తు ధనము పోయుదు
మని తమబిడ్డలను బెండ్లియాడు మటంచున్
వినిపింప వార, లాతఁడు
వనిత యనినఁ గంపతొడుగు వలె నెంచె మదిన్. ౯

ఎందఱో సుందరుల్ పలవరింతుర్ జపించుచు వానినామమున్;
ఎందఱో వానిపొందభిలషించుచు వేల్పుల మ్రొక్కుకొందు;రిం
కెందఱో మందుమ్రాఁకులు వహింతురు వానివశంబు సేకొనన్
అందని మ్రానిపండుకయి యఱ్ఱులు సాఁచుటగా నెఱుంగమిన్.

వంచిన తల యెత్తఁడు; నొ
ప్పించఁడు పల్లెత్తుమాటఁ బరవారల; వీ
క్షించఁడు వెలిచూపునను బ్ర
పంచము; లోఁచూపు వదలి వర్తిలఁ డెపుడున్. ౧౧

పరిణతప్రాయముననఁగాని పడయరాని
దృఢవిరాగంబును, గురూపదేశముసను
గాని కొనరాని తత్త్వవిజ్ఞాన మతని
వలచి వచ్చెనో నిండుజవ్వనముఁ జూచి? ౧౨

నఱకంగఁ బడుచున్న తరుగుల్మ వల్మీక
దంబంబు క్షాంతిపాఠంబు నేర్పఁ
గంటకక్షతులచేఁ గదలంగఁబాఱని
పాషాణములు దృఢవ్రతతఁ గఱప
క్షణభంగురములైన జలబుద్బుదంబులు
దేహాస్థిరత్వంబుఁ దెలుపుచుండఁ
బొడువుఁగ్రుంకులు దినంబును బొందు వేవెల్గు
జన్మపారంపరిం జదువఁజేయ
వెలుఁగుఁ జీఁకట్లు సుఖదుఃఖముల యశాశ్వ
తత్వమెఱిఁగింప నాత్మనిత్యతనుబాడ
శైలసంతతి యాచార్యుఁ డేలవలయు?
క్షితినిఁ దత్త్వోపదేశంబు సేయుప్రాంతె. ౧౩

అపరశుకమహర్షి యంచుఁ గొందఱువల్కఁ
జెప్పఁ బెక్కుమంది సిద్ధుఁ డనుచు
యౌవనమున దుర్జయంబైన యింద్రియ
గ్రామ మడఁచి లెస్స గ్రాలె నతఁడు. ౧౪

మనమున జనియించెను బ్రా
క్తన సంస్కారమున మోక్షకాంక్ష యతనికిన్
గను వేఁదుఱు గల యా జ
వ్వనంబున నలౌకిక స్వభావుం డగుటన్. ౧౫

నరులకుఁ గలిగెడు నానా
జరామరణ దుఃఖవితతి సహ్యముగామిన్
బొరలఁగఁ గన్నఁ రతఁ డొం
టరిగాఁ గూర్చుండి యిట్లెడందఁ దలంచెన్. ౧౬

"పాపభూయిష్ఠ మగు నీ ప్రపంచక్రమునఁ
బుట్టుఁ; జచ్చును; గ్రమ్మఱఁ బుట్టుఁజచ్చుఁ;
బుట్టుచావులు వెండియుం బొందుకొనుచుఁ
జక్రనేమిక్రమంబున జనుఁడు తిరుగు. ౧౭

పలువిషక్రిమికీటములకుఁ దావలమయి
పాడ్వడ్డ చీఁకటిబావి యంచు
నలువలంకులఁ దీరములులేని యుల్లోల
కల్లోల మగు లోఁతుకడలి యంచు
బొబ్బరిల్లుచు సింగములు పులుల్ పొదరిండ్లఁ
గడుకొన్న దట్టంపు టడవియంచుఁ
గుళ్ళి పుర్వులుపడి రోఁత సేయుచు గాలు
గొలిపెడు పెనుఱొచ్చుగుంటయంచు

రోసి సంసారముం బాసి కోసివేసి
దారపుత్ర ధనాది బంధముల నెల్ల
నారలు ధరించి పొడసి మనఃప్రశాంతి
నడవిఁ బట్టిరి మన తొంటి యార్యజనులు. ౧౮

పూఁతపసిఁడివోలెఁ; బొదిగి చక్కెరతోడ
మాటినట్టి విసపుమాత్రపగిది;
నైహికంపు సౌఖ్య మాపాతహృద్యంబు
తుదికిఁ దద్రిహాస్య మెదకుఁదెలియు. ౧౯

'గిరిఁ ద్రవ్వి యెలుకఁబట్టిన'
కరణి వ్యయపఱచి యమూల్యకాలం బెల్లన్
నరుఁ డణుతర సుఖమునకై
పరిశ్రమించుచు వహించు బహుదుఃఖములన్. ౨౦

'కుడితిఁబడ్డ యెలుక వడువునఁ, 'బెనురొంపిఁ
గూలఁబడ్డ యేన్గు గున్న భాతి,'
'ముండ్లకొమ్మఁబడ్డ పిట్టంబునై జనుం
డైహికములఁ జిక్కి యలఁతఁ గాంచు. ౨౧

మలభాండం బగు నీ శరీరమును, సమ్మానించి, కైసేసి భూ
షలఁ, జీనాంబరరాశి రేబవ లిదే స్వర్గం బిదే మోక్షమం
'చీలరుంబోఁడుల'ఁగూడి మానవుఁడు నాట్యంబాడుచుం బాడుచుం
గులుకుం బంగరుతూఁగుటుయ్యెలలఁదూఁగుం దత్వసమ్మూఢుఁడై.

తన దార పుత్త్రధనములు
తను వెనుకొని వచ్చుననియొ? తా నీ లోకం
బున "నట్టిగట్టి యుండుగుదు"
ననియో! యనుకొనుచు మర్త్యుం డరయఁడు పరమున్. ౨౩.

మేడల్ మిద్దెలు దొడ్లు తోఁటలును నిర్మింపన్ వలెన్, గ్రొత్తపెం
డ్లాడంగావలె యౌవతంబును, నమూల్యంబైన భూషాదులన్
వాడంగాఁ గొనఁగావలె న్ననుచుఁ జింతల్ సేయుఁగానీ, నరుం
డేఁడున్ వార్ధకమందునేని విడఁ డిస్సీ! తృష్ణ యానంతయున్.

తన జీవితలక్ష్యంబే
మని 'దానిని డాయుమార్గ మది యే' మనియున్
అనుకొనఁ డే కోశమునను
మనుజుం డొకపరియు మోహమగ్నత్వమునన్. ౨౫

ఆత్మలక్ష్యరోధు లగుచున్న యాంతర
శత్రువ్రజ జయింపఁజాల కిస్సి!
బాహ్యశత్రుగణము పయి కేల దండెత్త?
నింటగెలిచి రచ్చకెక్కఁ జెల్లు. ౨౬

తులకెత్తి యెడఁదమూలను
మెలమెలఁగా సాఁగి, యాక్రమించి కెలంకుల్
బలముగ నల్లు విషయశా
ఖల నాశాలతిక త్రెంపఁగాదు నరునకున్. ౨౭

ఒకవిషయము సిద్ధింప మ
ఱొక విషయముపైకిఁ బ్రాఁకు; నొదవిన నది వే
ఱొకవిషయమునకు సాఁగును
సకలం బీ వరుసఁ దృష్ణ జగ మల్లుకొనున్. ౨౮

ఆశవలనఁ గ్రోధ మద్దానఁ బాపంబు
దాన నరక మీ విధముగ సతము
ఆశ వేరు దన్ని యజ్ఞానముం బెంచి
భవపరంపరలకుఁ బనుచు జనుని. ౨౯

సరిరాదం డ్రిహాసుఖముం
బరలోకసుఖంబుఁ గోటిపాలున కేనిం
బురుషుని మనసున కాశను
బరిమార్చుటవలనఁ గలుగు పరసుఖమునకున్. ౩౦

అంటుకొన్నఁ దగిలి తంటసం బన లాగు
విషయసంగమంబు వీడిపోక
అడుసుఁద్రొక్కనేల? యడుగేల కడుగంగ?
సన్న్యసించి తపము సలుపుకొందు." ౩౧

అనుచు దార సంగ్రహమ్ము రోసి తృణముగా
నెంచి బంధనములఁ ద్రెంచి యెల్ల
నొక్కనాఁటిరేయి యొంటిమై నతఁడేగి
యాశ్రయించె నొక్క యాశ్రమంబు. ౩౨

కాంతాకనకంబుల క
శ్రాంతము దాస్యంబుసేయు సంసారుల కో
క్కింతయును బోధిసత్త్వుని
శాంతియు దాంతియు రుచింపఁ జాలునె? యరయన్. ౩౩

చెక్కించి చక్కఁగా సిద్ధంబుగాఁ జేయఁ
గాఁ బడినట్లున్న కందరములు
ప్రతిదినంబును నీరుపట్టి లెస్సగఁ బెంపఁ
బడుచున్నగతిఁ బొల్చు పండ్లచెట్లు
ఇచ్చవచ్చినరీతి ఋషివరుల్ త్రిప్పి కో
న్నట్లుగాఁ బ్రవహించునట్టి యేళ్లు
కల్పించి యొక్కనికై యేర్పఱచినట్లు
పొదలుచుండెడి పువ్వుఁబొదరుటిండ్లు
తరతమత్వంబు వెలిగఁ బెద్దగను బేర్పఁ
గాఁ బడినరీతిఁ గొమరారు గండశిలలుఁ
గలిగి చిత్తరుబొమ్మనాఁ గానఁబడుచు
నాత్మ కానంద మొసఁగు నా యాశ్రమంబు. ౩౪

అచ్చటి తపసు లతని కర్ఘ్యపాద్యము లిచ్చి
తలచుకొనుచుఁ దమ్ము ధన్యులుగను
దదుపదేశములకు నెద నిచ్చగించుచు
శిష్యులయిరి మెల్లఁ జెంతఁజేరి. ౩౫

పెద్దకాలంబునుండి యా విపినవర్తి
వృక్షతతి నా వయోమాత్రవృద్ధు లయిన
తపసు లా జ్ఞానవృద్ధు ప్రాంతమున నిలువ
దివ్విటీ క్రింది దివ్వెల తెన్ను దోఁచె. ౩౬

వాని శాంతమూర్తి వాని వైరాగ్యంబు,
వాని వదన బ్రహ్మ వర్చసంబు,
వాని సత్త్వవృత్తిఁ, బరికించి భావించి
రా తపస్వి దేవదూత యనుచు. ౩౭

శ్రుతిపర్వముగఁ గలశ్రుతు లొనర్చెడు శకుం
తములు గూర్మిని స్వాగతములు సదివె
నైడనీటి కెనయైన కడుఁ దియ్యనీటితోఁ
బఱచు వాఁగులు నీరువట్టు మాన్చె
నారఁబండియు నేల కంటుకొమ్మలు గల్గు
'వసుధారుహంబులు' పండ్లొసంగె
నల్లిబిల్లిగఁ దీఁగలల్లి చల్లనినీడ
లిడుచున్న పొదరిండ్లు 'విడుదు లొసఁగె
కార్ముకంబులు విచ్చి సఖ్యం బొనర్చెఁ
బాఁపమొత్తంబు పడగల వ్రాల్చి కొలిచె
రాలురప్పలు ముండ్లు మార్దవముఁబూని
యడుగు లొత్తుచు సేవించె నా మునీంద్రు. ౩౮

చిగురు దొడిగె మ్రోడుచెట్లు దట్టంబుగా;
వంజమ్రాఁకు లెల్ల బండ్లుగాచె;
క్షారజలము మధురజల మయ్యెఁ బ్రేయమ్మై
యా వనంబు నందు నతని రాక. ౩౯

నడివేసఁగి మిడియెండను
గడితంబుగఁ గుంభవృష్టి గల తొలకరినిన్
వడకించెడు చలితటి నా
తఁడు బయలనె గోచిపెట్టి తప మొనరించున్. ౪౦

అహారహము సాయములయందు నాశ్రమంబు
నారుబయలునఁ గూర్చుండి యా మునీంద్ర
బాలికాళికి ధర్మముల్ వక్కణించు
నా యమీంద్రుఁడు మధురవాక్యామృతమున. ౪౧

దురవగాహంబులై చిక్కువఱచుచున్న
తత్త్వ శాస్త్రార్థముల నద్భుతముగఁ దెలుపు
నరఁటిపం డొల్చిపెట్టిన కరణి నతఁడు
దీర్ఘకాలానుభవము సాధించినట్లు. ౪౨

పెలుశాస్త్రంబులు సదివినఁ
గలుగంబో దనుభవం బొకని; కొక్కనికిన్
గలుగును జదువకయున్నను
బలితం బగు పూర్వజన్మ వాసన కతనన్. ౪౩

తన్నుఁ బరులు గొట్టుచున్నఁ దిట్టుచు నున్నఁ
జంపుచున్న నరుఁడు క్షాంతి విడక
రాతిగుండెవైన దర్పియించి యేఱులై
పఱచునట్లు సేయవలయుఁగాదె! ౪౪

ఒరపిడినైన క్షాంతిఁ గొనియుంటనె రత్నము ప్రోజ్జ్వలించు; దన్
నఱకిన వానికిం దరువు నైకముగా ఫలపుష్ప శాఖలన్
గరుణవహించియిచ్చుఁగొని క్షాంతియె; గొంచక తన్నుద్రొక్కినన్
ధరణి వహించు జంతుతతిఁ దాల్చియె క్షాంతి నిరంతరంబుగన్.

శాంతియు, దాంతియు, క్షాంతియుఁ,
గొంతైనను దొరఁకనీయఁ గూడ; దవియె య
శ్రాంతము విశ్రాంతిని మన
స్స్వాంతంబున గొసఁగి మోక్షసాధకము లగున్. ౪౬

అనుచు క్షాంతిఁబూని యదె ధర్మసారమం
చన్యులకును గఱపు నాచరించు
క్షాంతివాది యంచు సార్థకనామంబుఁ
దాల్చియుండె నతఁడు దానఁ జేసి. ౪౭

ఆతం డచ్చటనున్న నాటఁగొలెఁ బుణ్యక్షేత్రి కల్పంబుగా
ఖ్యాతింగొన్న తదాశ్రమంబునకు నా యా యాత్రికుల్ పోవుచున్
ధాతం బోలిన యా మహామునిని సందర్శించి సద్భక్తిమై
పూతత్వంబు వహించు చుందు రనిశంబుం బ్రీతచిత్తంబునన్.

జరపుచునుండఁ గాలము ప్రశాంతముగా మునిచంద్రుఁ డీ గతిం
దరులకు వన్నె దిద్దుచు, లతాతతికిన్ రమణీయ నాట్యముల్
కఱపుచు, శ్రోత్రపేయముగ గానము నేర్పుచుఁ గోకిలాళికిన్,
సరస కళాప్రపూర్ణుఁడు వసంతుఁడు చక్కఁగ డిగ్గె భూమికిన్.

తరువులు సృజింపఁ దొడఁగెను
స్మరునకుఁ గావలయు నిశితశరజాలం బ
త్తఱి నా వసంతు నాజ్ఞను
మరంద దుర్విషహ విష నిమగ్నంబులుగాన్. ౧౦

ముడిచి యొడలు చలికి మూఁడంకెగాఁ బండి
నిదురఁ గూరుచున్న మదనుఁ డపుడు
కనులు నులుముకొనుచుఁ గాల్సేతులను సాఁగఁ
దీసికొనుచుఁ బాన్పు దిగెను మెల్ల. ౧౧

తరుణీ తరుణుల మనములఁ
బెరపెర ప్రారంభమయ్యెఁ బెద్దగ నా క్రొ
వ్విరి విల్తుఁ డమ్ము దొడుగఁగఁ
జెఱకునఁ] జుఱుకెక్కె మెల్ల సీతువు దొలఁగన్. ౧౨

వలపుల్ చిమ్ముచుఁ, బువ్వుగుత్తుల మనః పర్వంబు గావించు, దీ
వలు పైటు త్రిన లజ్జఁ దూఁగుచుఁ దరువ్రాతంబు పెవ్రాలుఁ; గాఁ
గిలికిన్ లాఁగును లాఁతి తీవియలనున్ గ్రేకొట్టు మోహంబునన్;
గిలిగింతల్ పచరించు గండశిలలం గ్రేళ్లుబ్బ నెయ్యంబునన్. ౧౩

తపనతాప మదనతాపంబు లొండొంటి
తీసిపోక రెచ్చ దినదినంబు
యువతి యువకజనము లుత్సాహమొందిరి
గృహసరోవరములఁ గ్రీడలాడ. ౫౪

అత్తఱి నా దేశపు రా
జోత్తముఁడు వధూశతంబు నొగి జలకేళీ
చిత్తుండయి కొని యా ముని
సత్తము వన మంటియున్న సరసున కరిగెన్. ౫౫

విడియించి యా మనోహర
తడాగతట మందుఁ గల లతాగృహముల న
య్యొడయఁడు తన శుద్ధాంతపుఁ
బడఁతుల క్రీడలకుఁ జిక్కి వర్తిలుచుండెన్. ౫౬

కులిదీఱక యొకరూపున
శతావతారములు దాల్చి చరియించెడినో
రతి పువ్విల్తునిఁ గలియఁగ
క్షితి నన యువతీజనంబు గెరలుచు నుండెన్. ౫౭

లలనల్ మన్మథపూజ సేయుచు సముల్లాసంబుగాఁ బాడుచున్
గలకంఠమ్ములఁ గమ్మదేనియలవాఁకల్ పాఱ, మంజీరమం
జులనాదంబు లెసంగ, లాస్యములు మెచ్చుల్ పుట్టఁ గావించు, చు
య్యాలలందూఁగుచు సంచరించి రచటన్ హృద్యంబుగా జేనికిన్.

పువ్వులబంతులఁ బ్రియుపై
ఱువ్వుచు, నెలజవ్వనంపుఁ గ్రొవ్వునఁ దమపై
ఱువ్వించుకొనఁగఁ దరుణులు
నవ్వుచుఁ గవ్వించి రతని నానాగతులన్. ౫౯

కలకంఠుల గానముఁ గో
కిలనాదముఁ గలియబడఁగఁ, గీరరుతంబుల్
పలుకులు సరిపడ, నరపతి
తెలియక తబ్బిబ్బు గొనె మదిఁ నవ్వఁ జెలుల్. ౬౦.

తడబడుచున్న మాటలు, నితాంతము బిత్తరిచూపు, మెల్లనై
చిడిముడిగొన్న నెన్నడలు, చెల్వముదోఁచుట మోముదామరన్,
బడఁతులకున్ స్వభావ మెలప్రాయమునం దిఁక మద్యపాన మి
బ్బడిగ నొనర్చె నత్తఱి నృపాలుని డెందము చిందులాడఁగన్.

రమణీయ కేశపాశము విప్పి విరియించి
నెమిలిరూపమునఁ గాన్పించె నొకతె
పలువర్ణ భూషణాంబరములం గొని పంచె
వన్నె చిల్కగను గన్పట్టె నొకతె
తరళ దృక్కులు పర్వఁ బఱతెంచు చట్టిట్టు
బాలకురంగినాఁ గ్రాలె నొకతె
మిసమిసలాడు మైపస, నింపు నింపుచుఁ
బూవుదీవియవోలెఁ బొలిచె నొకతె

అయ్యాయి పదార్థముల కడ నయ్యాయిగతిఁ
గానిపించుచు నెకిమీని మానసంబు
నలరుఁబోండ్లు హరింపఁగా నహామహమికఁ
బూని, నడయాడఁ దొడఁగి రా పువ్వుఁదోఁట. ౬౨

పొలయలుకఁ దీర్చు చొక చెలి,[3]
కులికించుచుఁ జిలిపి పనుల నొకయువతినిఁ, గో
యిలఁ బోలె నొకతె నెగచుచుఁ,
బలువిధముల రాజు రాణివాస మలర్చెన్. ౬౩

కరిణీ యూథము తోడం
గరీంద్రుఁడుం బలె వధూటికాతతి తోడన్
ధరణీపాలోత్తముఁడు వి
హరించుచు మునింగి తేలె నానందాబ్ధిన్. ౬౪

సలిపి సలిలకేళి స్మరకేళి సవరించి
యా నరేంద్రచంద్రుఁ డలఁతఁగాంచి
పొదరుటీరమందుఁ బూపాన్పుపైఁబండి
నిదురవోయె హాయి గదుర మదికి. ౬౫

అలసట నడంచు; దుఃఖం
బుల నిర్మూలించు నూచముల్లుగ; సంప
న్నులను దరిద్రుల సరిగా
వలచిన చెలి నిద్ర; దానివంటిది గలదే ? ౬౬

వనరామణీయకమునకుఁ
దనియక పతి నిద్రగొంట దరిసించి విలా
సిను లెల్ల రా ప్రదేశముఁ
గనువేడుక వెల్లివిరియఁగా నరిగి రొగిన్. ౬౭

వయసురానట్టి పడుచుల వరుసఁ గొన్ని
వయసువచ్చిన యువతుల పగిదిఁ గొన్ని
వయసుదీఱిన కాంతలపగిదిఁ గొన్ని
వృక్షములు తద్వనమునఁ గన్విందుసేయు. ౬౮

మును గననట్టి వృక్షములఁ బువ్వులఁ గాయలఁ బండ్లఁ గాంచుచున్
మును విననట్టి శ్రావ్యమగు పుల్గుల కూఁతల కొగ్గుచుం జెవుల్,
మును విహరింపనట్టి పొదమొత్తముఁ దూఱుచు విశ్రమించుచున్
మునుఁగుచు హర్షవార్ధిఁ బువుఁబోండ్లు విహార మొనర్చి రవ్వనిన్.

తన రమ్యకరపాద తలములం బగఁగొన్న
గతిఁబొల్చు చిగురాకు గములఁ జిదిమి,
తనదు సుందర పయోధరముల కెనవచ్చు
తోరంపుఁ బువ్వగుత్తులను గోసి
తనదు కోమల గాత్రమును ముట్టి యెదిరించు
మవ్వంపుఁ దీవెల మలయఁజేసి
తన మృదుకంఠ గీతంబు విడంబింప
నరుదెంచు కోయిల నదలఁజేసి

తనదు నెమ్మేని కమ్మవాసనల సురభి
కుసుమములఁ జేసి నిర్గంధ కుసుమములను
వనరమకు దిద్దఁ దనచక్కఁదనపు రీవి
చూపుచుఁ జరించె నట నొక్క సొబగులాఁడి. ౭౦

రమణులు మోముదమ్మిపయి వ్రాలెడు తేంట్లను ద్రోలు చోష్ఠబిం
బముపయి మూఁగుచిల్కలను బాఱఁగఁ జేయుచు, నాత్మశాఖలన్
దమకముగొన్న చందమునఁ దమ్ముఁ గనుంగొని కంటకావనీ
జములు చెఱంగులాఁగ బెలుచన్ వదలించుచుఁబోయిర య్యెడన్.

తలవని తలఁపుగ వృక్షం
బులు పెక్కు వికాసమొందెఁ బూవుంబోఁడుల్
కలకల నవ్వఁగఁ, దాఁకఁగఁ,
బలుకఁగ నర్మోక్తు, లాటపాట లొనర్పన్. ౭౧

ఈ తలిరాకు లీ సుమము లీ ఫలముల్ సరిక్రొత్త లివ్వి భూ
నేత కుపాయనంబుగను నేన యొసంగుదు మెప్పుఁగొందుఁ ద
త్ప్రీతికిఁ బాత్రురాల నయి వెలుదు నంచుఁ దలంచి కోసి తన్
లాఁతులు చూడనట్టులు చలమ్మున దాఁచె నొకొక్క చెల్వయున్.

చిఱునవ్వుల్ విరిమొత్తమై తరులతాశ్రేణిన్ వెలింగింపఁగా,
సరసోక్తుల్ మధుధారలై వనమునన్ జాల్వాఱఁగా, వీక్షణో
త్కరముల్ తోరణగట్టఁ జక్కఁగ దిశాకాండంబునన్, మెట్ట తా
మరలన్ సృష్టినొనర్పఁ బాదములు, కొమ్మల్ పోయిరా తోఁటలోన్.

ముద్దుముచ్చటాడు పులుఁగుల జంటల
మరులు రేఁగి యాలుఁ దరియు తేఁటిఁ
జక్కఁ గౌఁగిలించు జక్కవకవఁ గాంచి
నవ్వుకొనుచుఁ జనిరి పువ్వుఁబోండ్లు. ౭౫

మరులుఁ దీఁగెను ద్రొక్కిన మాద్రి వారు
మఱచి పతిమాట, విడిదికి మఱలుబాట,
ముగ్ధలై, యా వనంబు నపూర్వశోభ,
గమ్య మెఱుఁగక యేగిరి కడఁది దవ్వు. ౭౬

అరిగియరిగి వార లా మౌని చంద్రుని
యాశ్రమంబు డాయ నాదరించి
స్వాగతంబొసంగె ఛాత్రబృందమువోలె
శుకపికాది సకల శకునికులము. ౭౭

డాసిరి వారు మెల్లఁగ నెడందఁ గుతూహల మొప్ప, బద్ధపీ
ఠాసనుఁడై, ప్రశాంతవిషయస్పృహుఁడై, వినిమీలితాక్షుఁడై,
భాసుర బ్రహ్మతేజుఁడయి, భస్మమయాంగకుఁడై, మనోజ్ఞద
ర్భాసనవర్తియై, పొలుచు నా యమిసత్తము బోధిసత్త్వునిన్.

చిలుకను ద్రోలి, యా చెఱకుసింగిణి వ్రయ్యలు సేసి, త్రుంచి పూ
ములుకులు, మూలమట్టురతి మోహముఁ గోసియు, సన్న్యసించి, నా
రలు ధరియించి, ద్వంద్వముల రాయిడి సైఁచి, తపంబొనర్చు పు
వ్విలుతుఁడనంగ నొప్పె మునిముఖ్యుఁడటన్ నవకోమలాంగతన్.

కని యతని శాంతరూపం
బును మంత్రిముచేతఁ బోల్చెఁ బూవుంబోఁడుల్
తను విభ్రమములు తక్కఁగఁ
బ్రణత లయిరి శిరసువ్రాల్చి పాదద్వయికిన్. ౮౦

భక్తిరస మొలుకుచున్న హృత్పంకజంబు
హస్తపాదాబ్జములును నేత్రాంబుజములు
గలిపి దండగ గ్రుచ్చి యా చెలులు సేసి
రా మునీంద్రుని దివ్య పాదార్చనంబు. ౮౧

చెలువున కొసంగ నెయ్యం
బొలుకంగాఁ దారు కోసియును దాఁచిన యా
ఫల పత్త్ర పుష్పతతి ని
ర్మల భక్తిని నాతనికి సమర్పించి రొగిన్. ౮౨

పతగతతి మొదలుసేసిన
యతిథి స్వాగతసపర్య యా యతి మృదుభా
షితముల తోడన సంపూ
ర్ణతఁ బడయుట సతుల మనము ప్రమదం బొందెన్. ౮౩

వారల యప్రశ్నంబులఁ దపస్వివరుం డెద నాదరించి వి
స్ఫార విలోచనంబులఁ గృపారసపూరము జాలువాఱఁగా
వారల రత్నభూషలును వారి యమూల్య దుకూలవేషముల్
వారల తమ్మలంబుఁ దెలుపంగఁ దదైహిక తత్పరత్వమున్.

బలిత మగు సేవగొనియున్
గలఁగక దాంతాత్ముఁ డగుటఁ గనికరమున వా
రల నుద్ధరింపఁగా నీ
పొలుపున ధర్మోపదేశముల నొనరించెన్. ౮౫

తఱచుగా జీవి జీవయాత్రా స్రవంతి
నింద్రియావర్త బృందంబునందుఁ జిక్కి
వాని త్రిప్పులఁ దిరుగుచు వశము దప్పి
మజ్జనోన్మజ్జనంబుల మ్రిందుచుండు. ౮౬

పురుగయి పులుఁగయి పశువై
పరస్పహాస్రింబు లయిన బొమ్ములు గొని యి
ద్ధరఁ దుదికి జీవి వడయును
నరయోనిం బుణ్యాలవమునఁ జననంబున్. ౮౭

సుకృతోత్సేకము కతనన
సకలేంద్రియవత్త్వ గాత్ర చారుత్వ ధని
త్వ కులీనత్వ మహత్త్వా
దికసంపద మానవునకుఁ దేజిలుచుండున్. ౮౮

నరజన్మంబు వహించినాఁడనని యానందంబునన్ వీఁగుచున్
బురుషుం డక్కట? ఉత్తరోత్తర శుభంబుల్ పొందు నాలోచనం
బు రహింపఁ జేయక లబ్ధమైన స్వధనంబున్ గ్రుడ్డివాటంపు దూ
బరఁ గావించి యధోగతుం డగు నవిద్వాంసుం
డగుంబో తుదిన్. ౮౯

ఉత్తరకాలమం దిటులె యుత్తమజన్మముఁ బొందఁ జేయ నే
సత్తప మెట్టి హీనమగు జన్మము కల్గునో? యింక నాకు నం
చుత్తలపాటుతో హృదయ మూఱటఁ గాంచక మానవుండు వె
ఱ్ఱెత్తినరీతి నేడ్చుఁ గడ కెక్కుడుగా ననుతాప మొందుచున్.

తలఁచు నొక్కండు కడలి కెత్తాను నెత్త
నెంచు నింగికి నిచ్చెన నెత్త నొకఁడు
పృధివిఁ దలక్రిందు సేయ భావించు నొకఁడు
తనదు వాసన లార్పంగఁ దలఁపఁ డెవఁడు. ౯౧

ధన కనక వస్తు వాహన
తనయ కళత్రములు దుఃఖదంబులు తనతోఁ
జను దేరవు సద్ధర్మమె
మనుజుని వెనుకొనుచు సుఖనిమగ్ను నొనర్చున్. ౯౨

బుద్బుదప్రాయమగు ప్రాయమును దటిత్స
మాన మగు సంపదను నమ్మి మానవుండు
కటకట! శ్వపుచ్ఛముం గాని గంగ నీఁదు
వానిగతిఁ జెందుఁ గోరి నిర్వాణపథము. ౯౩

విషయసుఖము చెఱకు విత్తిమ్మున మునుముందు
స్వాద్యమయ్యుఁ దుదికిఁ జప్పఁ బాఱు;
విరస మయ్యు మందుకరణి వైరాగ్యంబు
మొదట, హిత మొనర్చు దుదికిఁ దుదికి. ౯౪

క్షితి జనియించినట్టి ప్రతిజీవియు శాంతిపథం బెఱింగి సం
చిత మగు పాపబృందము నశింపఁగ దుర్గతిద్వారాలప్రుచ్చి స
ద్గతిఁ బడయంగఁ, దృష్ణను బెకల్చి సమూలముగా మదిన్ దృఢ
వ్రతత జితేంద్రియుండయి పవిత్రిలఁగావలె జీవితాంతమున్.

అని యిట్లుపన్యసించుచు
మునీంద్రుఁ డుండంగ మెఱుఁగుఁబోం డ్లయ్యెడలన్
విను చతని యమృతవాక్కులఁ
దనియక కూర్చుండి రతిముదంబును గొనుచున్. ౯౬

రాజు చాలించి గాఢనిద్రాసమాధిఁ
గాలుసేతులు సాగించి కనులు నులిమి
యావులించుచుఁ జూచుచు నలసదృష్టి
నొడలు విఱుచుచు లేచి కూర్చుండె సెజ్జ. ౯౭

రమణుల మెఱుంగుఁ జెక్కుటద్దములయందు
నిద్దురను మాయు నందంబు దిద్దుకొనుచు
వారల తనూవిలాస వ్యాపారమందు
నోలలాడెడు మున్ను భూపాలవరుఁడు. ౯౮

కలకలలాడు చక్కనిమొగంబుల దర్శన మిచ్చి గండు గో
యిలల హసించు కంఠముల నింపగు మంగళగీతిఁ బాడి యం
దెలఁ బచరించి వాద్యముల నిద్దుర మేల్కొనుచున్న తన్నొగిన్
గొలుచు తటిల్లతాంగులఁ గనుంగొనఁ డొక్కతె నేని తేఁడటన్.

కేళాకూళుల నాడుచుండిరొ ? జలక్రీడల్ తగం, దూఁగుటు
య్యాలం దూఁగుచునుండిరో? పొదల నాట్యంబాడుచున్నారలో?
లీలాద్యూతము లాడుచుండిరొ? సుమాళిం గోయుచున్నారలో?
కాలం బెంత గతించెనో? తెలియ కిక్కాంతామణుల్ తోఁటలోన్.

స్వరసగల్ల పొదరుటిండ్లను
దరుణులు నిదురించుచుండ్రు దప్ప దటంచున్
బిరబిర చని పరికించుచు
నరపతి భగ్నాశ మగు మనంబున నులికెన్. ౧౦౧

ఏ యైంద్రజాలికుండేని నీ కొమ్మలఁ
జిగురుఁ గొమ్మలుగాఁగఁ జేసెనొక్కొ ?
ఏ మాంత్రికుం డేని నీ లతాతన్వుల
నలరుఁ దీవియలుగాఁ జలిపె నొక్కొ ?
ఏ మునిశాపమే నీ కురంగాక్షుల
లేడి మందలుగఁ గల్పించె నొక్కొ ?
ఏ వన దేవతయేని నీ చిలుకల
కొలుకులఁ జిలుకలఁ జలిపె నొక్కొ ?
ప్రాఁతగిలు పూవుటమ్ములఁ బాఱవైచి
యా యనంగుండె తూణీరమందు నిడెనొ ?
నాదు రతనంపు బొమ్మల నాదు మోహ
దేవతలఁ గేళికా కామధేనువులను. ౧౦౨

అని తర్కించుచు నవ్వని
మును గాంచిన యా ప్రదేశముల బల్మఱుఁ గాం
చును బలి తోఁపక కాల్గా
లిన పిల్లి యనంగఁ గళవళించు నెడందన్. ౧౦౩

వనమునఁ గ్రుమ్మరుచుండఁగఁ
'గని' దొరకిన పగిది వారి కాల్ముద్ర లొఁగిం
గనఁబడ నాతఁడు ముద్దిడు
కొను మ్రొక్కును గినుకఁ దీర్పఁ గోరిన కరణిన్. ౧౦౪

దారినిఁ జూప త్రేనికిఁ బదంబుల క్షుదరిల్లు ద్యూతికాళియై
వారల వేనలిం దొరగిపడ్డ స్వయంగ్రథిత స్రజంబు ల
వ్వారల కమ్మఁ గప్పురపు వాసన లీనెడు తమ్మలంబు ల
వ్వారల కోసియున్న ఫలపత్త్రి సుమంబుల తీరుఁ గాంచుచున్.

మనసుతోఁ బందియంబు నొడ్డినవిధానఁ
గాళ్లు పరుగెత్తఁ దడఁబాటు గదిరి కడిఁదిఁ
పడుచు లేచుచుఁ గ్రమ్మఱఁ బడుచుఁ బెద్ద
విసువుకొనుచును నడచెఁ బృథ్వీవరుండు. ౧౦౬

వలకాఁక కెండ బెట్టయ్యు
శిలాహతులుఁ దోడుపడఁగ క్షితినాథుఁడు ని
ట్టలమగు కినుకను గనలుచుఁ
గలుకులకై వెదకికొనుచుఁ గడు దవ్వరిగెన్. ౧౦౭

ద్రాలఁ గనంబడె నొక తరు
మూలంబునఁ దారకాసమూహము చంద్రుం
బోలె నొక చారుమూర్తిని
బాలాతతిఁ గొలుచుచుంట వసుధాపతికిన్. ౧౦౮

శరవేగంబున నతఁ డా
పరిసరమున వ్రాలి కాంచి పడతులగమి గ్రు
డ్లుఱుముచు బొమముడి పఱచుచుఁ
జుఱచుఱ నా యమ్మునిఁ జూచుచును నిలుచుండెన్. ౧౦౯

కాంతున కన్యునితోఁ దన
కాంతామణి యేకతమునఁ గానంబడినన్
స్వాంతము రగులదె ? కన్నుల
సంతమసము గ్రమ్ముకొనదె ? శాంతి తొలఁగదే ? ౧౧౦

మాటగట్టి నిజేంద్రియంబులను భక్తి
నతని కప్పన సేయుట నతివ లటకు
వచ్చి నిలుచున్న తమ భర్తవంకఁ గనరు
వినరు నాతని దగు పదధ్వనిని నేని. ౧౧౧

తనయానతి లేకయ యి
చ్చను విహరింపంగ వెడలు చంద్రాస్యలపైఁ
గొనియున్న బిట్టుకినుకను
మునిపైఁ దీర్పంగఁ బోయె భూపతి మొఱకై. ౧౧౨

మొదలనె మోహగ్రస్తుఁడు
తదుపరి సుమహా ప్రభుత్వ దర్పోద్ధతుఁ డా
పిదప నవివేకి ప్రకృతిని
మది ధర్మాధర్మములను స్మరియించు నెటుల్ ౧౧౩

ఈ మిండ తపస్వి యెవ్వం ?
డీ మునిముచ్చెవ్వఁ? డిట్టు లీ గతి నా కాం
తామణుల వశము సేకొని
కామోద్రేకమునఁ గన్నుఁగానకయుండెన్. ౧౧౪

తరుణీబృందము విశ్వసింపఁగ బకధ్యానంబుఁ గావించుచున్
దరియన్ రాఁగను మంత్రతంత్రవిధులన్ వశ్యౌషధ ప్రక్రియన్
మఱవం జేయుచుఁ గ్రీతదాసులనుగా మాఱించి స్వేచ్ఛాగతిం
జరియిం త్రిదృశతాపసబ్రువులు నానా మన్మథ క్రీడలన్. ౧౧౫

గోముఖవ్యాఘ్ర మనఁగఁ బయోముఖంపు
విషఘటం బనఁ గృత్రిమవేషమూనె
నితఁడు; కాకున్న సన్న్యాస మేడ ? యువతి
వర్గసాహాయ్యకంబు లేఁబ్రాయ మేడ ? ౧౧౬

భోగినుల యోగినులఁగా
భోగుల యోగులఁగఁ జేసి పొరిఁ బురుషులకుం
దీఁగంబోండ్లకు విరహో
ద్వేగముఁ గూర్తురు మునుల్ క్షితిం గొందఱహో! ౧౧౭

ఈ మాయల మారీచుని
సామీప్యమునందుఁ జేరి చనుదెంచిన నర్
మోమెత్తి యైనఁ గాంచరు
శ్యామామణు లెట్టి మందుఁ జల్లెనొ ! మేనన్. ౧౧౮

కనుపాపఁ దీయఁగలిగిన
ఘను లీదృశు; లీ ప్రపంచకము వంచింపన్
దన బానిసగ నొనర్పఁగ
మునివేష సమంబుగలదె ముల్లోకములన్. ౧౧౯

ఈ మేఁకవన్నె బెబ్బులి;
యీ మధులిప్తాసిపత్ర; మింకెందఱి క
న్యాభ్రమి హరించునో? సౌఖ్యము
లేమయి యీల్గింపకున్న నిత్తఱి ననుచున్. ౧౨౦

జేగురుముద్దగా మొగము, చిందఁగఁ గన్నుల విస్ఫులింగముల్,
తూఁగ సివంబుగొన్న గతిఁ, దొట్రిలుచుం దన గాత్రయష్టి, బి
ట్టూఁగఁగ వెన్కఁ గ్రొమ్ముడియు, నూడి భయానక సర్పమట్లు లా
యోగినిఁ బిల్లుమార్పఁగ సముద్యతుఁడై యొడయండు పేర్చుచున్.

పరపరన పండ్లఁ గొఱుకుచు
నోరనుండియు సురియఁ బెఱికి యుఱుముచును గదుర్
మెఱుఁగుం దాల్చిన మేఘము
తెఱఁగున వాచంయమేంద్రు దెసకుం బఱచెన్. ౧౨౨

సింగంబో? పులియో? యెలుంగొ? పఱతెం
 చెన్ మీఁదికంచున్ మదిం
గంగారుంగొని పెల్లు చెల్లచెదరై
 నానాదిశల్ పర్వ సా
రంగుల్ వోలెఁ బడంతు లయ్యతిథిఁ గూ
 రస్వాంతు నా మౌని న
ర్చిం గావింపఁగ నర్ఘ్యపాద్యముల సం
 రంభించె శాంతాకృతిన్. ౧౨౩

స్వాగత మాదరింపక నృపాలుఁడు త్రోసి తదర్ఘ్యపాద్యముల్
నాగమువోలెఁ జుట్టి 'యమినాధు 'వధింపఁగఁ గత్తి నెత్తఁగా,
డాఁగి భయంబునం గుఱఁగటం గల రాణులు, కాంచి కాంతునిన్
బ్రోఁగఁగ గంకణంబులును నూపురముల్ మణిమేఖలల్ వడిన్.

అరుదెంచి, నిరపరాధినిఁ
బరతత్త్వజ్ఞుని మహాత్ము వ్యర్థముగఁ గటా!
పరిపూతగోవునుం బలెఁ
బరిమార్పఁ దలంచు నాత్మ పతి వారింపన్. ౧౨౪

వినతోత్తమాంగలయి యా
వనితారత్నములు డాసి పాణిద్వంద్వం
బును గీలించి శిరస్సుల
నని రమృతంబొలుక నిట్టు లతిభక్తి మెయిన్. ౧౨౫

అబ్రహ్మణ్యము నాథా !
ఈ బ్రహ్మిష్ఠావతంసు నేల వధింపన్ ?
గోబ్రాహ్మణ హితుఁడవు క
ట్టా! బ్రహ్మవధం బొనర్చు టర్హం బగునే ? ౧౨౮

అరిషడ్వర్గము గెల్చి తాల్చి మెయి లోకానుగ్రహార్థంబ యు
ర్వర కాచార్యక మూని సంసృతిఁ దృణప్రాయంబుగా నెంచుచుం
బరమజ్ఞాననిరస్తపాపుఁడయి నిర్వాణైకలక్ష్యాత్ముఁడై
ధరఁ గాలంబును బుచ్చు నీయతిని బ్రమందం జేయఁ జన్నే ? ప్రభూ!

మన సమ్మతము మాటమ్మతము
కనుచూ పమ్మృతంబు తెలుపఁగా నేటికి? నీ
మునివరుఁ డమృతపు ముద్దయ
జననాథా! లే రమ్మాదృశ మహాత్ములిలన్. ౧౨౯

క్రొఱవిం దలఁ గోకుటయును
వెఱవక తన యింటఁ జిచ్చు వెట్టుటయు నగున్
ధరణీపతి! యేతాదృశ
పరమ మునీంద్రులను దురింప భావించుటనన్. ౧౩౦

అని మున్వర్ధము కాళ్ల వ్రేళ్లఁ బడుచున్ యాచించు నా సుందరీ
జనతాలాపము లగ్నికిన్ ఘృతహవిష్య ప్రాయముల్ కాఁగ వా
రిని హుంకారకఠోర కంఠమున దూరీభూతలం జేసి యా
తనిపైఁ గ్రమ్మఱఁ గత్తి నెత్తెఁ బతి మూర్తంబైన క్రోధం బనన్.

జనకుం బుత్రుఁడు, పుత్రునిన్ జనకుఁ,
　　డొజ్జన్ శిష్యుఁ, డా యొజ్జ శి
ష్యుని, భార్యం బతి, భర్త భార్యయు
　　వధించుం "గ్రోధసమ్మూర్ఛితన్"
మును వెన్కల్ కననీక దట్టముగఁ
　　గప్పుం గన్నులన్ జీఁకటిన్
అనుతాపంబును గూర్చుఁ గోపము
　　మనుష్యశ్రేణి కంతంబునన్. ౧౩౨

అతిరుష్టాపిశాచగ్రస్తుఁ డైనయట్టి
పతిని మరలింపఁజేసిన ప్రార్థనంబు
బూడిదం బోయు పన్నీరు పోల్కిఁగాఁగఁ
దొలఁగి రౌఁదల వాంచి తొయ్యలులుఁ దవ్వ. ౧౩౩

సప్తజిహ్వాలు సాఁచి జగమేర్చు కార్చిచ్చు
　　కడనున్న పెనుమంచుగడ్డ యనఁగ
మిట్ట వేసఁగి నెండబెట్ట విశ్వము మాడ్చు
　　రవియొద్దనున్న చంద్రముఁ డనంగ
నల్లకల్లోలమై యాభీల మగు నబ్ధి
　　దరిఁగ్రాలెడు ప్రశాంత సరసనంగఁ
బడగల విసముఁ గ్రక్కెడు కాలసర్పంబు
　　కడనున్న పీయూషఘట మనంగ

ఆకృతిం గొన్న రౌద్రమై యడలు గొలుపు
చేనికడ నిల్చియుండె నిర్భికుఁడగుచు
రూపముంగొన్న శాంతి నాఁ దాపసుండు
కదలఁ బోఁడని యంతరంగంబుతోడ. ౧౩౪

కాంచి యవ్విధంబు క్షాంతివాది మునీంద్రుఁ
డాత్మశాంతి వదల కాదరించి
భూపు నర్ఘ్య పాద్యములను గ్రిమ్మఱఁ బూజ
సలుపనెత్తి యిట్లు వలికె మెల్ల. ౧౩౫

క్షితి జనియించినట్టి ప్రతిజీవియుఁ బోయును నేఁడో! రేపో! జీ
వితముల, దీనికై పరితపింపసుమీ! లవలేశమేని నో
క్షితిప! మదాశ్రమంబు దయసేసిన నీ విట నా యొసంగు స్వా
గతము గ్రహింపవైతి వని కాల్చు విచారపు టగ్గి నా మదిన్.

కంచెయె చేని మేసిన ప్రకారమునన్ భువి దుష్టకోటి శి
క్షించఁగ శిష్టకోటిఁ బరికింపఁగఁ బ్రాపయి యున్న త్వాదృశా
భ్యంచిత పుణ్యమూర్తులె తపస్విజనంబు వధింపఁబూనఁ బ్రో
పంచిక ధర్మముల్ నిలుపు వా రెవరయ్యా! తలంచి చూడుమా!

చోరుఁడ నని తలచితివో?
జారుఁడ నని తలఁచినావొ? క్ష్మాపతి! పాపా
చారుండ ననియు ధర్మవి
దూరుఁడ ననియుం దలంచితో? మది నన్నున్. ౧౩౬

దురహంకారు, లనార్యు, లుద్ధతులు, క్రుద్ధుల్, మూఢు, లప్రాజ్ఞులు
ర్వార వర్తిల్లు గతిన్ భవాదృశులు విద్వాంసుల్ వివేకోన్నతుల్
చరియింపంగను రాసభాశ్వములు తుల్యంబయ్యెఁ బో!యంచు న
వ్వారె? లోకుల్ సదసద్వివేకులు మహీపాలా! విచారింపవే!

నీ యువతీ బృందం బిటు
నా యాశ్రమమునకు రాఁగ నాతిథ్యంబుం
జేయుట నా తప్పిదముగ
నీ యాత్మకుఁ దోఁచెనే మనీషిసుత్రాత్మా! ౧౪౦

ఏల యకారణంబుగనె యివ్విధి బొమ్మముడిన్ బిగించి, దం
తాలను గీటుచున్, రుధిరధారలు గ్రక్కుచు నోట, ఖడ్గముం
దాలిచి కేల నా పయికి దర్పమహాంధత దూఁకుచుంటి శా
ర్దూలమువోలె డెందమునఁ దొందరపాటు వహింపఁబోకుమీ!

ఆతిథ్యార్పణము మహా
పాతకముగ ధర్మబోధ ప్రామరకృతిగా
బూతుగ 'నమ్మా' యంటయు
భూతలపతి నీకుఁ దోఁచెఁబో! యే మందున్. ౧౪౨

పోనిమ్ము సమ్మతింతును
నేను మహాపాపి ననుచు నినుబోట్టి మహా
జ్ఞానులు క్షుబ్ధ మొనర్తురె?
మానస శమవార్ధిఁ గ్రోధ మంధరగిరిచేన్ ౧౪౩

శతృ నిగ్రహణ క్రియాశక్తి కన్న
క్షాంతి నిర్వహణ క్రియాశక్తి మేలు
దాన రాజర్షి పదము సార్థకము తేని
కన్యమున నాతని నృశంసుఁ డండ్రు ప్రజలు. ౧౮౪

పలుశాస్త్రంబులు వేదముల్ సదివినన్ వాతాశనాధారుఁడై
తలక్రిందై తప మాచరించినఁ గడున్ ధర్మోత్తరుండైన భూ
తల మవ్వాని ననార్యుఁగాఁ దలఁచు "శాంత్యం భూషణం" మ్మన్న పె
ద్దల వాక్యంబు నెవండు శాసనముగా ధ్యానించి పాలింపడో?

అనెడి హితోక్తి కా నరవరాధముఁ డల్కను బెర్చి బిట్టు
లను విస మెక్కు పామువలె "లావు విరాగము నాటుకొన్న నీ
మనసున నేల నన్ను బతిమాలుదు వీ గతిఁ బ్రాణరక్షణం
బున కయి దీనదీనముగ మూఢుని రీతి" నటంచుఁ బల్కెనన్.

యతిచంద్రుండు వచించె నిప్పగిది "నిన్ సూచింపఁగా లేద క్షాత్ర
పతిచూడామణి! నశ్వరంబయిన నా ప్రాణంబుపైఁ దీఁపిచే
క్షితి నిర్దోషిని బీదసాధుని వధించెన్ భూవరుం డన్న శా
శ్వత దుష్కీర్తి వహింతు వీ వనుచు నా స్వాంతంబు
పొక్కుం గడున్. ౧౮౫

నా యట్టి యభాగ్యుం డొకఁ
డీ యిలఁ జన్మించు కతన నీదృగ్గతినీ
కీ యపకీర్తి ఘటిల్లును
గా! యని నా యెద సహస్రఖండంబు లగున్. ౧౮౬

కయిజాతినఁ గాల్జాతిన
పయినిం జేయంగఁ దగ్గ పని యున్నదె? తె
స్సయుఁ దో త్త విచారింపని
క్రియ కుట్టుచునుండు మదిని వృశ్చిక మనఁగన్. ౧౪౯

ఎవఁ డుట్టి గట్టి యూఁగును
భువి నాచంద్రార్క తారముగఁ? బోదురు వె
న్దవులుచు నొక్కొక్కరె; దీ
న వృధా సంతాప మొందు నరుఁడు నరుండే? ౧౫౦

నీ వంశాటవిఁ గాల్చును
దావాగ్ని యనంగ రేఁగి త్వత్పాపం బో
భూవర! నీ యొక్కనితోఁ
బోవద యిందులకు నేను బాగులుచు నుంటిన్." ౧౫౧

అని ముని యుపన్యసించిన
వినఁ డాతం డూష రోప్త బీజము మొలకె
త్తునె? రుచి యగునే చక్కెర?
ఘన పిత్తాశయుని నాలుకకు నెన్నండున్. ౧౫౨

అనపరాధులై, మహాపవిత్రములైన
గోగణంబు మన్నిగొనుచు నున్న
కో[illegible]లు పులికి భూమి పాలకుం డన్నయో!
తమ్ముఁడో! యటంచు నమ్మఁ దగును. ౧౫౩

కరఁగింపవచ్చుఁ గొండలఁ;
గరఁగింపగవచ్చు నీ యఖండావనియున్;
గరఁగింపరాదు మూర్ఖుని
దురహంకార పరిపూర్ణ దుర్మానసమున్. ౧౫౪

అవనిధరముల వ్రచ్చు వజ్రాయుధంబు,
నఖిల లోకంబు లార్చు బ్రహ్మాస్త్ర బలము,
నప్రతిహతంబు హరి చక్రమైన వృధయ
పరమ మూర్ఖుని మూర్ఖత వ్రియ్యాలింప. ౧౫౫

ఓ కపటయోగి! చూడుము
నీ కథ సాంతం బొనర్తు నిమిషార్ధములో
నా కత్తి యాఁకలిని నీ
మైకండలఁ దీర్ప సంభ్రమింపడుచుండెన్. ౧౫౬

ఇదె! నీ దంభము వెల్లడింతునని భూమీశాధముం డున్నత
ప్రదరాఘాతముచేత వక్షానిజన రాడ్బాహాలతం ద్రుంచె బె
ట్టిదపున్ రక్తఝురుల్ సిరావితతి నుండిన్ మీఁదికిం జిందఁగా
హృదయంబుం బగిలించుఁ జూపఱకు నాదృశ్యంబు దుష్ప్రేక్ష్యమై.

చలియింపండు మనంబునందు; వదనచ్ఛాయంబుఁ గోల్పోఁడు; క
న్నుల రానీఁడు విషాదబాష్పలవమున్; దూషింపఁ డాదుష్ప్రభున్
దలఁపం డెట్టి ప్రతిక్రియం గడిఁది బాధం బొందుచున్; గాని యు
త్తలమొందడున్ ముని తేని దుర్యశముకై తప్తాంతరంగంబునన్.

గఱుల న్నఱకఁగ రాఁగా
బురందరుం డేఁడు సంద్రముల డాఁగిన య
గ్గిరులెల్ల నీ మునీంద్రుని
చరితకుఁ దల వాంచుకొన్నవె సత్యముగ విన౯ ! ౧౫౯

మిను విఱిగిపడ్డఁ, బిడుగులు
తనపైఁ బదివేలు పడ్డఁ దపియింపం డా
త్మను వీరుఁడు తన కొఱకయి
వనటం గొనుఁ గాంచి పరులపాటున కెడఁద౯. ౧౬౦

కిమ్మనఁ డీతఁ డిప్పగిదిఁ గే ల్దెగి రక్తము పాఱుచున్న నా
శమ్ముల; మాఱుకుండె ముఖలక్షణ మల్పముఁ; గానరాదు కో
పమ్మును నాపయి౯ స్రవి నృపాలకుఁ డక్కజమొంది క్రూరకా
ర్య మ్మొనరించినాఁడనొ? మహాత్ముఁడొ! యాతఁడు? పాపి నైతినో!.

పొరవడితినో మునిమ్రుచ్చని
పరమేశ్వర సదృశుఁ డగు తపస్వినిఁ? దన కేల్
నఱకిన నా పయిఁ గరుణా
భరితాపాంగముల నెట్లు పరగించెడినో? ౧౬౨.

త్రికరణ శుద్ధుఁడు, దాంతుం
డకలంకుం డనుచు నకట! యరయక తద్దం
గికురించి చేయి మిగిలితి
నిఁకఁ బ్రాయశ్చిత్త మేమి యీ చేతి కిల౯? ౧౬౩

ఎందుల కింత దౌష్ట్య ముదయించెను నాకు? మదీయ సుందరీ
బృందము తెల్పినం బెడచెవిం గొను నంతటి మౌర్ఖ్య మేల నా
డెందము నిల్లు గట్టుకొనె? డెప్పర మయ్యెను నా చరిత్ర; యే
మందులఁ బాపరోగ మది మానును నాకుఁ బ్రశాంతిగల్గెడిన్.

ఘాతుకత వచ్చు నా కొగి
నాతిథ్యార్పణము సేయ నరుదెంచు గుణా
న్వితునిఁ గొదుకక కెడపిన
పాతక మడఁగునొకొ వేయిబాముల కైనన్? ౧౬౫

అనుచుం ద్వరపడి చేసిన
పనికై యనుతాపవహ్నిఁ బడి మ్రగ్గుచు న
మ్మునిపాదాబ్జముల క్షమా
ర్పణ మడుగఁగ ఖిన్నుఁ డగుచు వ్రాలెను భక్తిన్. ౧౬౬

జననాథు క్రోధయజ్ఞం
బునకుం బలివైన సాధుమునిచంద్రుం డా
తనిఁ దాను క్షమించిన దే
వుని బారింబడక తప్పిపోఁడని పొగులున్. ౧౬౭

ఆ నరపాలు నంగముల నత్తఱి వృశ్చికకోటి కుట్టు చం
దానను, దాల్చి కత్తులను దద్దయు వాతలు పెట్టునట్లుగం,
బూనిక గ్రుచ్చునట్లు కొఱవుల్ గొని; రంధ్రములం దొలంచున
ట్లూనఁగ రాని బాధ యొకఁ డుద్భవమయ్యె క్షణక్షణోగ్రమై.

నిలువఁగఁ జాల కాతఁడు వనింబడి పొర్లును, గాలుసేతులన్
విలవిలఁ దన్నుకొంచుఁ బలవించును; బారలు సాఁచి నాల్గు ది
క్కులఁ శరణార్థియై పఱచు; ఘోరపుభూతముఁ గాంచుచున్న య
ట్టులు నెలుఁగెత్తి యేడ్చును గడుంగడుఁ బైత్త్యము నెత్తికెక్కఁగన్

విసముం గ్రక్కుచుఁ బెద్ద విప్పి పడగల్ విచ్చేయుఁ బెన్నాగముల్;
గ్రసియింపంగను నోరువిచ్చి పయికిన్ లంఘించు శార్దూలముల్;
ముసలాద్యాయుధ పాణులై పొడువ నాలోకించు సైన్యంబు; న
ల్దెసలం బాపము చుట్టుకొన్న గతి ధాత్రీనాథునిం గన్పడెన్.

బొమముడి బిగించి యుఱుముచు
ధుమధుమ లాడుచును నెదుటఁ దోఁచి రనేకుల్
యమదూతలు, పిల్చిరి తమ
సమీపమున కరుగుదేర క్ష్మాపతిఁ బితరుల్. ౧౭౧

గిరగిరఁ దిరుగుచుఁ బెను సుర
కరువలి వలె వశముదప్పి గాత్రంబువడెన్
క్షత్రియులు వాఱిన భూగ
హ్వరమునఁ దలక్రిందుగా లతాంగుల యెదుటన్. ౧౭౨

తన కండకావరంబున,
ధనాంధకారమున, సద్ధితంబులు వెగలై
మునులకుఁ జెనంటిఁ గూర్చెడు
జనునకుఁ గా కిట్టి గతులు సద్గతు లున్నే ? ౧౭౩

పతిదుర్మరణంబునకై
కుతకుత యుడుకంగ నెడఁదఁ గోమలులును నా
క్షితిగర్భంబున దూఁకిరి
సతులకు ననుమరణ మిలను సహజంబ కదా! ౧౭౪

వలదు సాహసంబు వలదన్న సంయమి
నోటిమాట యుండ నోటియందె;
భర్తృమోహపాశబద్ధలు గావుట
వెడలి రెల్ల రతని వెంబడించి. ౧౭౫

ఎరగలి తన కారణ మగు
తరు వొక్కటె కాక ప్రాంతతరువులను బలెన్
దురితము కర్తనె కాకి
ద్ధర బుగ్గి నొనర్చుఁ బ్రాఁకి తద్వంశంబున్. ౧౭౬

అంతకుమున్న మంత్రులు విహారమునకై పువుఁబోండ్లఁగూడి భూ
కాంతుఁడు చన్నఁ బెద్ద క్షితికంపము పుట్టి తుపాను రేఁగి క
ల్పాంతమునందువోలె మనుజాగ్రణి సౌధచయంబుఁ బూడ్పఁగా
శాంతికపౌష్టికంబులను సల్పఁగఁజేయఁగ వచ్చి చేనికై ౧౭౭

వనమధ్యంబున సంచరించుచును దత్ప్రాంతంబు విచ్చేసి, య
మ్మునిగాత్రంబు పఠించు టాదిగఁ జెలుల్ భూగర్భముం జొచ్చుదా
కను గండ్లారఁగ జూచి దైవవిధికిం గైమోడ్చి యుర్వావమా
ననకుం గల్గు ఫలంబుఁగాంచి వెఱపొందన్ డెంద మత్యంతమున్.

నెత్తుటం దోఁగుచున్న యమ్మినిన్ మెలమెల్లఁగఁ దారసించి చే యెత్తి నమస్కరించుచు "మునీశ్వర! నీ కిటువంటి మేటి యా పత్తును గూర్చి యున్న జనపాలుని మంత్రుల మేము; మాకుఁగిం చిత్తు విపత్తురాని గతిఁ జేయుమ! యి మ్మభయప్రదానమున్.

ప్రతికింపుము మా ప్రభువును
ప్రతికింపు కృపార్ద్రమతిని రాణుల మమ్మున్
ప్రతికింపు మరాజకమున
యతినాథ! క్షమించి తొంటి యపచారంబుల్." ౧౬౦

అని ప్రార్థింపగ క్షాంతివాది యను "నేలా మీరు భీతిల్ల? నె వ్వని పాపం బతనిం దినున్; భయ మెదర్ వర్జింపుడీ! దాఁటిపో యిన వా రెవ్వరు లేచివచ్చి; రిపుడె ట్లేతెంత్రు మీవారు? వ చ్చిన మీ కన్నను నేన హెచ్చుగను హర్షింతున్ మనస్ఫూ ర్తిగన్." ౧౬౧

తరువు శాఖను బలెఁ గేలు దరుగుచున్న
వానిపయి లేని యలుక మీ పై నేల!
మఱచిపోతిని గోప మన్మాట యెపుడొ?
ఇత్తఱిం గొత్తగ క్షమింప నేమిగలదు? ౧౬౨

అనని యరాజకం బగు నటంచు భయంపడకుండు; మీదు భూ ధవుని సమీపబంధు సముదాయమునన్ శుభలక్షణాఢ్యుఁడై పవిమల వృత్తుఁడై పరగు బాలకు నొఁదలఁ గట్టి పట్టముల్ భువి కభిషిక్తుఁజేసి కొలువుం డతనిం దలవాంచి భక్తిమై. ౧౬౩

ఈ చోటియందుఁ గల ధ
ర్మాచరణ పరాయణాత్ముఁ డయి చతురుండౌ
వాచంయమేంద్రుఁడు గురుం
డై చదువఁగఁ జేయు నతని నామ్నాయంబుల్. ౧౮౪

వరవడి దిద్దింపుం డా
చిఱుతుకచే క్షాంతి ప్రముఖ విశిష్టగుణంబుల్
స్థిరముగ నదుకుఁ "డహింసా
పరమో ధర్మ" యను సూక్తి వాని యెడందన్. ౧౮౫

అని యాదేశసమానము
ముని యుపదేశం బొనర్చి మూసెను గన్నుల్;
కననియు విననియు తేజము
జను లబ్బురపడఁగ వెడలె శమిగాత్రంబున్. ౧౮౬

కన్నుల వ్రేఁగయ్యెఁ దుదిం
గన్నులకుం బండు వగుచుఁ గానంబడె న
భ్యున్నత మగు మునిదృశ్యము
మన్నింపఁగఁ బదియు నాల్గు మండలము లొగిన్. ౧౮౭

ఆ మహనీయు నాశ్రమమునందు వసించు పిపీలికాది నా
నామృగపక్షి బృందము ఘనంబగు భక్తినిఁ జేరవచ్చి యా
శ్రీమృతకాయముం గని భజించెను తద్దయు జాలువాఱగా
మోముల బాష్పపూరము 'నమోనమ' యంచును
వ్రాల్చి యాఁదలల్. ౧౮౮

ఆ నృపమంత్రు లాత్మహృదయంబులు గండిపడంగ నశ్రు సం
తానము కాల్వగట్టుచు వనస్థల మంతయుఁ జెమ్మగిల్లఁగా
మౌనినిఁ జందనాగరు సమంచిత కాష్ఠచితి న్నమర్చి యెం
తేనియు నూర్పులన్ విసరు చెట్లో? దహింపఁగఁజేసి రయ్యెడన్.

ప్రోవిడి యస్థిచయం బా
తావునఁ గల్పించి శిల్పితండంబులచేఁ
గోవెలఁ జెక్కించిరి ముని
దేవుని యీ కథను దేటతెల్లముగాఁగన్. ౧౬౦

ఆతని కూరుచున్న తరు, వాతని నిత్యము స్నానమాడు ఏ,
వాతని పూలుగోయు లత, లాతని పండెడు రాతి సైజ్జయున్
ఖ్యాతతటిఁ బుణ్యతీర్థములుగా గణియించుచుఁ బోవు యాత్రిక
వ్రాతము నిచ్చ లుత్సవపరంపర లచ్చట నొప్పు నేఁటికిన్.

పరమపవిత్రమైన మునివర్యు చితాభసితంబు నొక్కరో
క్కరె గ్రహియించి దోసిటను గండ్లకు నద్దుచుఁ బోదు రిండ్లకున్
జ్వరితలకుం బిశాచగణ బాధితకోటికి నౌషధంబుగా
ధరణిని వాడుకొంద్రు సతతం బటకుం జనుచున్న యాత్రికుల్.

